యస్సర్వగుణసంపూర్ణస్సర్వదోషవివర్జితః । ప్రీయతాం ప్రీత ఏవాలం విష్ణుర్మే పరమః సుహృత్ ॥



జగద్గురు శ్రీమన్మధ్వాచార్యమూలమహాసంస్థానము,
శ్రీమదుత్తరాదిమఠాధిపతులైన

**శ్రీశ్రీశ్రీ 1008 శ్రీసత్యాత్మతీర్థ శ్రీపాదులవారి పరమపావనమైన అధ్యక్షతయందు**

## ఉత్తరాదిమఠం అధ్యాత్మవాణి యూట్యూబ్ వాహినిలో
## పం. వాదిరాజాచార్య కరణం వీరితో చెప్పబడిన

# శ్రీమన్మహాభారతతాత్పర్యనిర్ణయంయొక్క మంగళమహోత్సవం

## 05-06-07 జులై 2024

క్రోధి, జ్యేష్ఠ, అమావాస్య, ఆషాఢ ప్రతిపత్, ద్వితీయా

**స్థళం - సువర్ణపురి (సోన్), పరశురామక్షేత్రం, తెలంగాణ**



అందరికీ ఆదరపూర్వకమైన స్వాగతం



# శ్రీమన్మహాభారతతాత్పర్యనిర్ణయ మంగళమహోత్సవం

## జ్యేష్ఠ అమావాస్య, ఆషాఢ పాడ్యమి, విదియ

(జులై 05-06-07-2024, శుక్ర-శని-ఆదివారం)

---

మహావిష్ణువు వేదవ్యాసులుగా అవతరించాడు. వేదవ్యాసులు ముక్తికి సోపానమైన తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించారు. వేదాలను విభజించారు. వేదోత్తమమైన మహాభారతాన్ని విరచించారు. సర్వోత్తముడు రచించిన సర్వోత్తమమైన శాస్త్రం మహాభారతం.

సూర్యుడు లేడంటే జగమంతా అంధకారబంధురమవుతుంది. మహాభారతం లేదంటే అందరి జీవితమూ అజ్ఞానంతో, విపరీతజ్ఞానంతో దుర్భరమవుతుంది. వెలుగు లేకుంటే సర్దుకోవచ్చేమో, జ్ఞానం లేదంటే సర్దుకోవడం అసాధ్యం. మహాభారతానికి ప్రత్యామ్నాయం లేదు. మహాభారతానికి సాటి మహాభారతం.

### మహాభారతం లేదంటే

పరబ్రహ్మమైన విష్ణుతత్త్వం తెలిసేది కాదు. మనిషి నిలువెత్తు ధర్మాన్ని, జ్ఞాన-విజ్ఞానాలను సంపాదించుకోవడం అసాధ్యమయ్యేది. భేదం బోధపడేది కాదు. ప్రపంచం సత్యమనే తత్వం మరుగున పడేది. ముక్తికి సోపానం కనిపించేది కాదు. భక్తికి భుక్తికి తేడా తెలిసేది కాదు.

వర్తించడం ఎలా? ప్రవర్తించడం ఎలా? విధి-నిషేధాలు ఏమిటి? ఎందుకు? ధర్మం, అర్థం, కామం, మోక్షం అంటే ఏమిటి? ఈశ-దాస్యభావం, బింబప్రతిబింబ-భావం, సృష్ట్యాదిక్రియలు, విష్ణుసర్వోత్తమత్వం, లక్ష్మీనారాయణుల అవియుక్త-మైన దాంపత్యం, వాయుజీవోత్తమత్వం, దేవతాతారతమ్యం, గురువుల గరిమ, ప్రకృతి గురించిన పరిజ్ఞానం, అంతయూ విష్ణ్వధీనమనే బుద్ధి ఇవేవి ఉండేవి కావు.

భోగ-భాగ్యాలు ఎంత మేరకు అవసరం? ఎంత మోతాదులో సుఖాన్ని అనుభవించాలి. దుఃఖాలను ఎలా అధిగమించాలి? సంతృప్తిని పొందడం ఎలా? సమాధానంగా ఉండటం ఎలా? కలిసిమెలిసి ఉండటం ఎలా? వైరాగ్యాన్ని ఎలా వృద్ధిచేసుకోవడం? భార్యతో ఎలా మెలగాలి? భర్తతో ఎలా వెలగాలి? పిల్లలకు ఎలా వెలుగు పంచిపెట్టాలి? పిల్లలకు ఎలా వెలుగవ్వాలి? తల్లి-

దండ్రులను ఎలా సేవించాలి? బంధువులతో ఎలా మసలుకోవాలి. చుట్టూ ఉన్నవారితో చుట్టరికం ఎలా ఉండాలి? ఇత్యాది ఇత్యాది ఏదీ కనిపించేది కాదు.

చివరికి నేను ఎవరు? నేనేం చేయాలి? నా జీవితానికి అర్థం ఏమిటి? పరమార్థం ఏమిటి? అర్థం-పరమార్థం లేని జీవితంవల్ల కలిగే అనర్థాలేమిటి? ఇలాంటి కోటి కోటి విషయాలు బోధపడేవి కావు.

మా ఉసురు మహాభారతం. మా ఊపిరి మా ప్రాణం మహాభారతం. భారతీయుల మహోన్నతమైన శాస్త్రం మహాభారతం. భారతీయుల గర్వం మహాభారతం. భారతీయుల సర్వస్వం మహాభారతం. ప్రపంచమంతా భారతదేశాన్ని తలెత్తుకుని చూసేలా చేసిన గ్రంథతేజం మహాభారతం.

ఇలాంటి మహాభారతానికి భాష్యం మహాభారతతాత్పర్యనిర్ణయం. మహాభారతాన్ని పరిస్పష్టంగా తెలిపే కోశం మహాభారతతాత్పర్యనిర్ణయం. విరోధాలను, అవరోధాలను పరిహరించి పరమార్థరహస్యాన్ని నిర్ణయాత్మంగా ఇదమిత్థం, నేదమిత్థం అని ప్రబోధించే శాస్త్రం మహాభారతతాత్పర్యనిర్ణయం.

ఇలాంటి శాస్త్రాన్ని రెండు సంవత్సరాలనుండి ఉత్తరాదిమఠం అధ్యాత్మవాణి యూట్యూబ్ వాహినిద్వారా నేను (వాదిరాజాచార్య కరణం) ప్రతిరోజూ ప్రవచనం చేస్తూ ఉన్నాను.

ఈ సదవకాశాన్ని, మహాసౌభాగ్యాన్ని కల్పించినవారు మా అందరి గురువరేణ్యులైన, శ్రీమన్మధ్వాచార్యమూలమహాసంస్థానాధిపతులైన, బ్రహ్మ, శ్రీమన్మధ్వాచార్య, జయతీర్థ, విద్యానిధితీర్థ, రఘూత్తమతీర్థ, విద్యాధీశతీర్థ, సత్యసంధతీర్థ, సత్యప్రమోదతీర్థకరార్చితములైన మూలసీతాసమేత మూల-రామ, దిగ్విజయరామ, వ్యాసముష్టి మొదలైన అష్టావింశతి ప్రతిమలను, వంశరామ, ప్రసన్నవిట్ఠల స్వామిని ప్రతినిత్యం ఆరాధించే, సర్వమూల, శ్రీమన్న్యాయసుధాది సకలసచ్ఛాస్త్రపాఠప్రవచనపరినిష్ఠితులైన శ్రీ1008శ్రీ సత్యాత్మతీర్థశ్రీపాదులవారు.

వారి ఆదేశంతో, అనుగ్రహంతో ఈ జ్ఞానకార్యం సజావుగా సాగుతూ ఉంది. ప్రస్తుతం వారి ఆదేశంతో ఈ మహాభారతతాత్పర్యనిర్ణయంయొక్క మంగళ-మహోత్సవానికి శ్రీకారం జరిగింది. శ్రీపరశురామక్షేత్రమని సుప్రసిద్ధమైన సువర్ణపురీ (సోన్) ఈ మంగళమహోత్సవానికి వేదిక కానుంది. ఇదే జ్యేష్ఠ అమావాస్య, ఆషాఢ పాడ్యమి, విదియ (జులై 05-06-07-2024, శుక్ర-శని-ఆదివారం) రోజులందు ఈ మహత్కార్యక్రమం సుసంపన్నమవుతుంది.

తెలుగువారికోసం, తెలుగుభాషలో ఈ కార్యక్రమం. కనుక మహాభారత-తాత్పర్యనిర్ణయాన్ని శ్రవణం చేసినవారందరూ ఈ కార్యక్రమంలో పాల్గొనవలెను. ఇదే సందర్భంలో పరమపూజ్యులైన శ్రీ 1008 శ్రీసత్యాత్మతీర్థశ్రీపాదులవారు మహాభారత ప్రవచనాన్ని ప్రారంభించి ఆశీర్వదించనున్నారు. కనుక ఇకపైన మహాభారతాన్ని శ్రవణం చేసేవారు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొనవలెను. ఈ సందర్భంలో విద్వాంసుల విశిష్టమైన ప్రవచనాలు, సంగీతం మొదలైన కార్యక్రమాలు కూడా నెరవేరుతాయి. ఈ సందర్భంలో తెలుగుభాషలోని భక్తిపాటలు ప్రస్తుతింపబడతాయి.

భక్తులందరూ అధికసంఖ్యలో పాల్గొని ఈ మంగలమహోత్సవాన్ని విజయవంతం చేయాలని, తను-మన-ధనములతో సేవలను చేసి, శ్రీహరి-వాయు-గురువుల అనుగ్రహమునకు పాత్రులు కావలెనని ఈ మూలకంగా విజ్ఞాపన చేస్తూ ఉన్నాము. అందరూ ఆహ్వానితులే.

...ఆహ్వానించువారు...

పం. విద్యాధీశాచార్య గుత్తల, పం. శశిధరాచార్య దివాన్,
పం. వాదిరాజాచార్య కరణం, పం. అక్షోభ్యాచార్య, శ్రీయుత నాలం రామకృష్ణారావు
I.F.S. (ret'd), శ్రీయుత నాలం నరసింహారావు I.A.S. (ret'd) శ్రోతృవృందం,
సువర్ణపురి (సోన్) సకలసద్భక్తులు.

---

## ... సేవావివరము ...

| | | | |
|---|---|---|---|
| ఉదయాస్తమానసేవ | 1 లక్ష | వస్త్రదానసేవ | 4,000 |
| బ్రాహ్మణసమారాధన | 1 లక్ష | సకలవిఘ్న హర నరసింహమంత్రహోమం | 3,000 |
| భిక్షసేవ | 50,000 | | |
| సామూహికభిక్షాసేవ | 25,000 | సంతానప్రద శ్రీకృష్ణమంత్రహోమం | 3,000 |
| అన్నదాన సేవ | 10,000 | | |
| తాత్పర్య నిర్ణయ పారాయణ సేవ | 5,000 | సమర్పణసేవా | 2,000 |
| | | అర్పణసేవా | 1,000 |

**Bank details**

**NAME - UTTARADHIMUTT**
**A/c NO - 21352217905**
**IFSC CODE. IDIB000S738**
**Indian Bank Soan Branch**



**Contact – 9010791685/79899 88630/8886188802/9490172317**